ఇవ ॥ ౫౨ ॥ తారితాస్మస్త్వయంనాథబ్రహ్మణాపరమేష్టినా । అథామి
ర్యోగిచింతానాంయ స్త్వమస్మాభిరీక్షితః ॥౫౩॥ అహోమహానుభావోయ
మబ్జయోనిఃపితామహః । త్వమాగతోసియద్ధస్తైహవిర్గ్రహణతత్పరః ॥
యజ్ఞదానతపోహోమధ్యానాధ్యయనకర్మభిః । దుర్లభందర్శనంయ
స్యసత్వమస్మాభిరీక్షితః ॥ ౫౫ ॥ ప్రసీదపుండరీకాక్షప్రసీదపురుషోత్తమ ।
ప్రసీదదేవదేవేశరక్షాస్మాన్ శరణాగతాన్ ॥ ౫౬ ॥ నారదః ॥ ఏవంసం
స్తుత్యవిబుధా వైకుంఠంపురతఃస్థితం । తత్పాదాంభోరుహద్వంద్వ శర
ణంసంప్రపేదిరే ॥౫౭॥ ఇత్థమాదౌకృతయుగేజంబూద్వీపేతుదక్షిణే।భా
గేభారతవర్షేతుక్షేత్రేసత్యవ్రతాఖ్యకే ॥౫౮॥ చైత్రమాసిసితేపక్షేచ
తుర్దశ్యాంతథామునే । శోభనేహస్తనక్షత్రేరవివారసమన్వితే ॥౫౯॥
వపాహోమేప్రవృత్తేతుప్రాతస్సవనకాలికే ధాతురుత్తరవేద్యాంతః
ప్రాదురాసీజ్జనార్దనః ॥౬౦॥ అథసురమనుజాదయస్తగానీంవరదముదీ

---

లట్లనీలోకంబులెల్ల నీయందనున్నయవి - యీమహానుభావుండైన నలువ
చే యోగిజనంబులకైన నగమ్యుండవగు నిన్నుంగాంచి కృతార్థులమై
తిమి- యీపితామహుండు తనహస్తంబుననిచ్చిన హవిస్సును నాదరంబు
నంగ్రహించితి వీతనిభాగ్యం బింతయనివచింపంజాలము యజ్ఞతపోదా
నాధ్యయనాదికర్మంబులనైన నిన్నుంజూడనలవిగా దట్టినీవు మాకుదర్శ
నంబిచ్చితివి ఓపుండరీకాక్షా- ఓదేవదేవా శరణాగతులమగు మమ్ముం
గావవేయని దేవతలెల్ల యావరదుండైన విష్ణుదేవుంగాంచి యాతని పా
దకమలంబులకెరంగి శరణంబునొంది రిట్లు కృతయుగాదియందు జంబూ
ద్వీపంబున దక్షిణభాగంబున భారతవర్షంబున సత్యవ్రతమహాక్షేత్రం
బునందు చైత్రమాస శుక్లపక్షంబున రవివార హస్తానక్షత్రయుక్తచతు
ర్దశినాడు బ్రహ్మదేవుండుగావించిన యశ్వమేధ ప్రాతస్సవనకాలం
బున నుత్తరవేదియందు వపాహోమంబున విష్ణుదేవుండువరదుండయి
యావిర్భవించినదేవతలు ఋషులును మనుజులుమొదలగువారెల యాచే

త్స్యవిమానవేదీమధ్యే । రజనికరమివోదయాద్రిశృంగే కుముదవనానియ
ధాయయుఃప్రమోదం ॥ ౬౧ ॥

ఇతి బ్రహ్మ్యాపురాణే భృగు నారదసంవాదే హస్తిగిరి మహాత్మ్యే
భగవత్ప్రాదుర్భావో నామ సప్తమోధ్యాయః ॥



నారదః ॥ తతఃప్రదీప్తానలవేదిమధ్యగంనిజప్రభామండలమండితంహ
రిం । సునిర్మలంనిర్మలచిత్తగోచరం దదర్శసంతుష్టమనాశ్చతుర్ముఖః ॥ ౧ ॥ నిశాచరాకప్రభశంఖచక్రిణంజ్వలత్సహస్రాంశుసమానశేఖరం । సముజ్జ్వలద్రత్నకిరీటకుండలంసురేంద్రచాపప్రతిమభ్రువంవిభుం॥౨
మహేంద్రనీలాభలలాటనిశ్చలప్రదీప్తసంపత్తిలకోజ్జ్వలాననం । ఉదార
సౌభాగ్యసితావతంసకంలలాటలోలాలకరాజితాకృతిం ॥ ౩ ॥ సముల్లస

---

దిమధ్యంబున విమానస్థితుండైన వరదుంగాంచి వుదయించుచంద్రుం
గాంచి రంజిల్లు కుముదవనంబు లట్ల పరమసంమదంబునందేలిరి.

ఇది బ్రాహ్మ్యపురాణంబున హస్తిగిరిమాహాత్మ్యంబున
భృగునారద సంవాదంబునందు భగవత్ప్రాదుర్భావ రూ
పంబై వెలుంగు సప్తమంబైనయధ్యాయము..........✻



నారదుండుభృగువునకిట్లనియె:—ఓమునీంద్రా-ఇట్లు యజ్ఞవేదియందు
ప్రదీప్తానలమధ్యంబున నావిర్భవించి కోటిసూర్యకాంతులుగల్గి నిర్మ
లుండై చిత్తగోచరుండై సూర్యచంద్రులంబోలు శంఖచక్రగదాధారియు
ప్రకాశించెడు కిరీటధారియునై యింద్రచాపంబురీతిప్రకాశించు భ్రూ
యుగంబులుగల్గి మహేంద్రనీలసదృశంబయిన లలాటంబునం బ్రదీపిత
తిలకధారుండై ఉదారసితావతంసకుండై లలాటచంచలాలకవిభాసమా

కాంచనబాహుబంధనంసముల్లసత్కాంచననూపురద్వయం । కుశేశ
యాపేశితపాదపంకజం విభక్తగుల్ఫంత్రసురస్థిరేస్థితం ॥ ౪ ॥ అవిశ్లథ
వర్ణాంసళిగూఢజానుకంక్రమానువృత్తోరుయుగోచితాంబరం । ప్రసన్నవ
క్త్రస్మితశోభితాధరంవిశాలలోలాంబుజలోచనద్వయం ॥౫॥ ఉదారసౌ
భాగ్యకపోలమండలం సునాసికాకల్పితతంమహాభుజం । తతస్తముద్వీక్ష్య
పురస్థితంహరింవితానవేద్యామతసీసమప్రభం ॥౬॥ సతత్క్షణోద్భూత
సుఖార్ణవాప్లుతో యయౌతదాకృత్యవివేకమూఢతాం । ఉపావిశన్మౌన
ముపాగతఃక్షణంజగౌననతౌక్రమతానకంపునః ॥౭॥ రుద్రోధభూయ
స్తనుమైత్యక్షణంతతఃపరంక్ష్వేళనతత్పరోభవత్ । ప్రదక్షిణంప్రీతిత
థాప్రదక్షిణంప్రయాతిరుద్రంపునరేతిసన్నిధిం ॥౮॥ అజిఘ్రదాస్వాదయ
దబ్జలోచనంవవర్షపుష్పాణిననాదవిహ్వలః । కరేణపస్పర్శముమూర్జ
తద్వపుఃప్రియేణగాఢంపరిషస్వజేక్షణం ॥౯॥ పునఃపరిక్రమ్యననామపాద
యోఃబహుప్రధాపప్రవణోభవత్క్షణం। ఇతిప్రహర్షాద్వివశశ్చతుర్ముఖ
శ్చకారచేష్టావివిధాస్తదగ్రతః ॥౧౦॥ తతస్సమాధాయమనఃప్రసన్నధీ

---

నుండై కాంచనబాహుబంధనుండై కాంచనమయ నూపురద్వయధారియై
పంకజంబులంబోలు పాదంబులుగల్గి విభక్తగుల్ఫుండై స్మితవక్త్రశోభి
తాధరుండై పంకజవిశాలలోచనుండై ఉదారసౌభాగ్యకపోలంబులుగల్గి -
సునాసికాధరుండై మహాభుజుండై సర్వాంగసుందరుండై యతసీపుష్పస
మానభాసురశరీరుండైయున్న హరింగాంచి చతుర్ముఖుం డానందాం
బుధిందేలి కృత్యాకృత్యంబు లెఱుంగంజాలక కొంతప్రొద్దుండి మరలలేచి
నర్తనంబు గావింపుచునుండ రుద్రుండేతెంచియావరదుంగాంచి యా
నందకందళితహృదయుండై యతిశయంగా క్ష్వేళనంబు గావింపుచుండే
సలువయు నాచంద్రశేఖరుతో గూడి విష్ణుదేవునకు ప్రదక్షిణంబుగా
వందనంబు జేసి పుష్పంబులపై జల్లుచు కరంబుల శరీరం
బెల్ల నిమురుచు - ప్రియంబున గాఢాలింగనంబుచేసి - మూర్ధాఘ్రాణం

జగద్గురుం ప్రేత్యపునశ్చతుర్ముఖః । ప్రణమ్యబద్ధాంజలిరాననతాననః
ప్రచక్రమేస్తోతుమనుక్రమాద్ధరిం ॥౧౧॥ బ్రహ్మ ॥ ప్రసీదదేవప్రణతార్తి
నాశనప్రభావితోహంభవతావ్యయాత్మనా । అగోచరస్సర్వమనోగిరా
మపిత్వమేవమద్దృష్టిపథంగతోసియత్॥ ౧౨ ॥ అనాదిమధ్యాంతమజంప
రంపదంనిరంజనంనిర్గుణమక్షయంశివం । తదవ్యయజ్యోతిరచింత్య
మక్షరంత్వమేవవిజ్ఞానమయంజనార్దన॥ ౧౩॥ అణోరణీయ్యాంసమనం
తమవ్యయంమహాంతమవ్యక్తమనీశమీశ్వరం । పరాత్పరంకారణకార
ణంహరింనిరాశయంత్వాంప్రవదంతిసూరయః॥ ౧౪॥ యథాగ్నితప్తాః
పయసస్స్ఫులింగకాఃసహస్రశోస్యపరితఃస్ఫురంతిహి । తథైవజీవాశ్చ
భవత్ప్రకాశతోపినిర్గతాస్సత్వరజస్తమోవృతాః॥ ౧౫॥ యజ్ఞాంతకృద్య
జ్ఞపతిహుతాశనోహవిర్విధిఃకర్తృఫలానికర్మణాం । వికారహీనో
జగదేకకారణస్త్వమేవవిజ్ఞానమయంగుణాధికం ॥ ౧౬ ॥ అసచ్చసచ్చా
న్యమపారమక్షయంనిరస్తదుఃఖంచవిశోకమవ్యయం । అసూక్ష్మమస్థూల

---

బు గావించి ప్రదక్షిణంబు జేసి పాదంబులపైబడి మరియు ననేకవిధచేష్ట
లు గావించి బద్ధాంజలియై ప్రసన్నమానసుండై యివ్విధంబునంబొగడె-
వో దేవదేవా - వో ప్రణతార్తిభంజనా - మనోవాగగోచరుండవగు నీవు
నాదృష్టిగోచరుండవైతివిగాన నేకృతార్థుండనైతి - నీవాదిమధ్యాంత
రహితుండ వజుండవు పరమపదస్వరూపుండవ క్షరుండవు శివుండవు నిర్గు
ణుండవు పరంజ్యోతి వాత్మజ్ఞానమయుండవు అణురూపుండవు మహాత్స్వ
రూపివి పరాత్పరుండవు కారణకారణుండవు నిరాశయుండవు అగ్నిత
ప్తంబులగు పయఃస్ఫులింగంబు లంతటంబ్రకాశించునట్లు జీవలోకంబు
లెల్ల రజస్సత్వ తమోగుణసహితంబులై నీయందులీనంబులై ప్రకాశిం
చుచున్నయవి - యజ్ఞపతివి - యజ్ఞభోక్తవు - యజ్ఞఫలదుండవు - నీవ లో
కంబులకెల్ల కారణభూతుండవు - నీవ జ్ఞానస్వరూపుండును గుణాధికుం
డును సదసత్స్వరూపుండును నిరస్తదుఃఖుండును స్థూలసూక్ష్మరూపుండు

మదీఘుణమవ్యయంనిరాశ్రియంత్వాంవరదంసమాశ్రియే॥ ౧౭॥ మేఘా ఝ్జాతాన్యద్రిగుహాంతరేషుయథాసముద్రంసలిలానియాంతి । తద్వైవసర్వ ప్రభూతానియానివిశంతితాన్యేవభవంతమీశం ॥ ౧౮ ॥ త్వన్మాయయావి శ్వమిదంవిమూఢంనచైవజానాతినిజస్వరూపం । త్వయ్యేవజాతంత్వయి వృద్ధిమేతిత్వయ్యేవవిశ్వేశలయంప్రయాతి ॥ ౧౯ ॥ స్థూలంసూక్ష్మంపార మపారభూతంత్వయ్యేవవిజ్ఞానమయంచధామ । పరాపరేశంనిహితం గుహాయాంనిరత్యయంనిష్కళమామనంతి ॥ ౨౦ ॥ త్వమీశ్వరస్సర్వగురు గరీయాన్నతిర్యగూర్ధ్వంచతథాప్యధస్తాత్ । నచక్షుషాపశ్యతికశ్చన త్వాంహృదిస్థితంవ్యక్తమచింత్యరూపం॥ ౨౧॥ యదవ్యయంసాంఖ్యవిదో వదంతిసునిర్మలంకేవలమప్రమేయం । వికారహీనంప్రకృతేఃపరంచత్వ మేవవిశ్వేశ్వరవిశ్వరూప॥ ౨౨ ॥ అదృశ్యమగ్రాహ్యమగోత్రమవ్యయంమ హత్సుసూక్ష్మంత్వమనంతమీడ్యం । పరాత్పరంనిత్యమజంశివంచతవప్ర భావోభువనాతిరిక్తః ॥ ౨౩ ॥ సురామనుష్యాఃపశవశ్చవృక్షాస్సరీసృపా

---

నై ప్రకాశించుచుందు వట్టి నిన్ను నేనాశ్రయించెద - మేఘంబు లద్రిగు హాంతరాళంబుల వర్షించినజలంబులు సముద్రంబు జేరినట్లు నెచ్చటహు తంబుగావించిన నిన్నుం జేరు - నీమాయచే నీలోకంబులెల్లబుట్టు - వృద్ధి నొందునణంగు - యీలోకంబులకెల్ల నీశ్వరుండవు - గురువు నీవనీవంత ట వ్యాపించియుందువు - హృత్పుండరీకమధ్యస్థుండవగు నిన్నెట్లు నేత్రం బులంజూడనగు - అచింత్యరూపుండ వవ్యయుండవు - నిర్మలుండ నప్ర మేయుండవు - వికారహీనుండవు - ప్రకృతికింబరుండవు - విశ్వరూపుండ వదృశ్యుండవు - అగ్రాహ్యుండవు - అగోత్రుండవు - పరాత్పరుండవు - అజుండవు - శివుండవై ప్రకాశించుచుందువు - నీప్రభావంబు భువనాతిరి క్తంబు నీరూపంబు సాంఖ్యయోగులెరుంగంజాలుదు రితరులకెరుంగం దరంబుగాదు సురాసురులు- మనుజులు - సర్పంబులు- శైలంబులు- నదు లు- సముద్రంబులు- పిశాచ యక్షరక్షోగణంబులు- తారకంబులు- సుర

శైలసరిత్సముద్రాః । పిశాచ యక్షోగ్రహతారకాశ్చరక్షాంసిభూతానీ
సురద్రుమాశ్చ॥ ౨౪॥ పయోముచో మేఘవరాశ్చవిద్యున్నభో మరుద్వహ్ని
జలానిపృథ్వీ । ఏతానిసర్వాణిహరేత్వదీయసంకల్పమాత్రేణసముద్భవం
తి॥ ౨౫॥ సురేశవైశ్వానరకాలరక్షోజలేశవాయూత్తరదిక్పతీశాః। దిశా
గజాశ్శేషకులాచలాశ్చత్వైవరూపాణినచత్వదన్యే ॥ ౨౬ ॥ బహూనిదుః
ఖానిసురేశజన్మజరామయోత్థాన్యతిసముద్భవాని। అతీత్యనిర్వాణమహా
సుఖకామాస్త్వామేవధీరాశ్శరణంప్రయాంతి॥ ౨౭॥ అనేకజన్మార్జితపా
పరాశేర్నజాతుచిత్తంత్వయిసన్నిధత్తే । వికృష్యమాణంవిషయైరసం
ఖ్యైఃచరత్యజస్రంపరమప్రహృష్టం॥ ౨౮ ॥ నిరుద్ధనిశ్వాసకథాదియోగా
త్ప్రదుష్ప్రధర్షస్త్వమనీశయోగైః । తథాపికారుణ్యతయైవనాథచిరా
యమేదృష్టిపథంగతోసి॥ ౨౯॥ యాన్యేవకర్మాణికరోతిజంతుస్తాన్యేవ
పాపానిభవంతితస్య । నవిప్రియఃకశ్చిదిహాస్తిలోకేసత్వంకథంపశ్యతి
లోకనాథ॥ ౩౦ ॥ మహార్ణవేదుఃఖమహాజలౌఘభయాతిశోకాభినివేశ
పూర్ణే। ప్రియాసుహృత్ప్రేమరసాతిగాఢేనిమగ్నమభ్యుద్ధరమామనంత॥
౩౧ ॥ క్షేత్రాణిమిత్రాణిధనానినాథపుత్రాశ్చదారాఃపశవోగృహాణి ।

---

ద్రుమంబులు- మేఘంబులు- భూమియు- వాయువు- జలంబులు- అష్టదిక్ప
తులు- దిగ్గజంబులు- కులాచలంబులుమొదలగు సర్వంబునునీరూపంబు -
నీసంకల్పమాత్రంబునంబుట్టు-నణంగు. జన్మజరాదిదుఃఖంబులనెల్లమాని-
నిర్వాణంబుగోరువారు నిన్నుశరణంబుజొత్తురు - అనేకజన్మంబుల నేజేసి
నపాపపుంజంబులచే- నొకప్పుడైన- నాచిత్తంబు నీయందుదగలదు- నిరు
ద్ధనిశ్వాసకథాది సంయోగాదుల నిన్నెరుగనశక్యంబైనను - నాయందు
దయచే- ననేకదినంబులకు- నాదృష్టిగోచరుండవైతివి- జనుండాచరించు
కర్మంబులెల్ల - పాపంబులకు- కారణంబులగు - మహాదుఃఖజలంబులు
గల్గి- భయశోకాభిపూర్ణంబై - ప్రియాప్రియరసాతిగాఢంబైన- సం
సారసముద్రంబున- మునుంగు నన్నుద్ధరించుము- క్షేత్రమిత్రధనంబులు-

త్వత్పాదపద్మప్రవణాత్మవృత్తేర్భవంతిసర్వేప్రతికూలరూపాః॥ ౩౨॥ అజ్ఞానమోహాంధతమోభిభూతా నత్వాంప్రపశ్యంతిసదాహృదిస్థం। పునఃపునర్జన్మజరాభయేషుసుఖేషుదుఃఖేషుపరిప్లవంతి॥ ౩౩॥ భవాబ్ధిమధ్యేవినిమజ్జతాంతుపరాగతిర్దేహభృతాంత్వమేవ। పితాచమాతాచసుహృచ్చబంధుస్త్వమేవసర్వంమమదేవదేవ॥ ౩౪॥ భక్తింప్రసీదభగవంస్త్వయినిర్మలాంమేనిత్యంత్వదీయపదపద్మనిషేవణాంచ।త్వద్దర్శనైకరసతాంచదృశోరజస్రంత్వన్నామకీర్తనపటుత్వమనంతవాచాం॥ ౩౫ ॥ మాయావిమోహితమతిర్భగవన్నజానే కృత్యంకృతంచకరుణాంచహితాహితేచ।త్వత్పాదపద్మకరుణాపహృతాత్మమోహస్త్వామాత్మనోగతిమహంశరణంగతోస్మి॥ ౩౬॥ పాపానిపూర్వచరితానిబహూనియానిశక్యంనతానిగదితుంయుగకోటిభిర్మే। వేత్థత్వమేవసకలంజగదంతరాత్మన్తస్మాత్త్వదంఘ్రియుగళంశరణంగతోస్మి॥ ౩౭॥ త్వన్నాభిరుహపుండరీకజనితస్సర్గాదికాలేహ్యహం త్వాంస్తోతుంకథమీశ్వరోస్మిజగతః పూర్వంపరంకారణం। తేజోవీర్యబలావబోధజలధింజ్యోతిఃపరస్తాత్పరం

---

పుత్రదారపశుగృహంబులెల్ల నీపాదభక్తిభరితుండగు వానికింబ్రతికూలంబులగు - అజ్ఞానమోహాంధతమోదూషితులగు వారునిన్నెరుంగంజాలరు- జన్మజరాభయదుఃఖాదుల మునుంగువారికింగతినీవ- నాకుందల్లిం-దండ్రివి- బంధుండవు - సర్వంబునునీవ- నాకునిరంతరంబు నీపాదకమలంబులయందు నిశ్చలంబైన భక్తిని నీదర్శనంబుచేయుదృష్టిని - నీనామంబులకీర్తింపంజాలు వాక్పటుత్వంబునిచ్చి- రక్షింపుము. నేమాయామోహితుండనై- కృత్యాకృత్యంబుల - హితాహితంబుల- నెరుంగంజాలకున్నవాడ. నీపాదపద్మదర్శనంబున - విగతమోహుండనై- నిన్నుశరణంబుజొచ్చితి. నాకునీవగతివి- నేననేకజన్మంబుల- జేసినపాపంబులలెక్కింపంజాల. దానినెల్ల నీవయెరుంగుదువు. నేపూర్వంబున - నీనాభికమలంబుట్టినవాడ - నిన్నుంగొనియాడ నాదరంబుగాదు. తేజోవీర్యబలాధి

త్వామేవంశరణంగతోస్మి కృపయా సంరక్ష మాం కేవలం॥ ౩౮॥ నారదః॥ ఇత్యుక్త్వా శిరసా పపాత సహసా తత్పాదపద్మద్వయే ప్రీతః పూర్ణమనోరథంచ పురుషం ధ్యాయన్పురోవస్థితం । వైకుంఠం వరదం వరేణ్యమనఘం భక్తప్రియం పద్మభూర్నిర్దోషం నిరసిష్టమచ్యుతమజం నీలాభ్రపింఛప్రభం॥

ఇతి బ్రాహ్మ్యపురాణే హస్తిగిరిమాహాత్మ్యే బ్రహ్మస్తోత్రం నామ
అష్టమోధ్యాయః.

నారదః॥ తతః ప్రసన్నో భగవాన్పుండరీకాయతేక్షణః । శ్లక్ష్ణగంభీరనిర్ఘోషముచాచ స చతుర్ముఖం ॥ ౧॥ శ్రీభగవాన్॥ ప్రసన్నోస్మి సముత్థిష్టస్తోత్రేణ చతురానన । దర్శితా మయి తే భక్తిరంజసాత్యంతదుర్లభా॥ ౨॥ మత్ప్రీతేసు చిరంకాలం త్వయా తప్తం మహత్తపః । అతస్సందర్శితం రూపం తుభ్యమేతన్మమావ్యయం ॥ ౩ ॥ యజిష్టోహం త్వయా క్షేత్రే

---

కుండవై- పరంజ్యోతివైన- నిన్నుశరణంబుజొచ్చితి. ననుం గృపం గావుమని- యివ్విధంబున- పరిపూర్ణమనోరథుండై- పురోవర్తియై- నిర్దోషియు భక్తసులభుండు - అనఘుండును - అచ్యుతుండును - అజుండును - వరేణ్యుండు - వరదుండైనవిష్ణుదేవుని పాదపద్మంబులపైబడి చతుర్ముఖుండు వేడుచుండె.

ఇది బ్రాహ్మ్యపురాణంబునందు - హస్తిగిరిమాహాత్మ్యంబున -
బ్రహ్మస్తోత్రరూపంబైన - యష్టమంబైనయధ్యాయము.



నారదుండు భృగువునకిట్లనియె:—నంత - నలవకు - విష్ణుదేవుండు - ప్రసన్నుండై- మేఘగంభీరవంబుగా నిట్లనియె. ఓచతుర్ముఖా- లేలెమ్ము- బహుకాలంబునుంచి- నీవొనర్చినతపంబునకు- హయమేధయజ్ఞంబునకు- భక్తికి- నీవు జేసినస్తోత్రంబునకు మెచ్చి- ప్రసన్నుండనై- నారూపంబుజూ

హాయమేధేనభక్తితః। తతఃప్రసన్నేనమయాదర్శితంరూపముద్భుతం॥ ౪॥ మమసౌమ్యమిదంరూపంశంఖచక్రగదాధరం । నదేవానచగంధర్వానచ పశ్యంతియోగినః॥ ౫ ॥ యజ్ఞదానతపోహోమైర్నదృశ్యోహంకదాచన । అనన్యయైవభక్త్యామాంపశ్యంతిబ్రహ్మవాదినః॥ ౬ ॥ అనన్యాంమయితేభక్తింజానామికమలోద్భవ । అతఃప్రియతమంవిద్ధిత్వయాదత్తంహవిర్మమ॥ ౭॥ అగతోహ్యహమత్రైవయదర్థంవ్యక్తవిగ్రహః । నకేవలంచతుర్వక్త్రతవప్రియచికీర్షయా॥ ౮ ॥ యదేతద్భవతాదృష్టంవిమానందివ్యముత్తమం । పుణ్యకోటీతివిఖ్యాతంసర్వపాపవినాశనం ॥ ౯ ॥ అస్యసందర్శనంబ్రహ్మన్దుర్లభంయోగినామపి । మత్ప్రసాదాదిదంలబ్ధంభవతాశుద్ధచేతసా॥ ౧౦॥ పుణ్యకోటివిమానాంతర్యేమాంద్రక్ష్యంతిజంతవః । బ్రహ్మహత్యాదికైఃపాపైర్ముచ్యంతేనాత్రసంశయః ॥ ౧౧॥ హితాయసర్వభూతానామావిర్భూతమిదంమహత్ । విమానందివ్యమతులంపుణ్యకోటీతివిశ్రుతం॥ ౧౨॥ అత్రాహంహయమేధేనతోషితోభక్తితస్త్వయా । అతోవిమానమధ్యేస్మిన్దృష్టవానసిమాంస్వయం ॥ ౧౩ ॥ వైదికీభిఃక్రియాభిర్మాంయజంతేత్రదృఢవ్రతాః । నచతత్సదృశాస్సంతి

---

పితి - యీరూపంబును సకలదేవతలు - మహాయోగులు - యజ్ఞదానతపోహోమాదులం గావించినవారైన-జూడంజాలరు. అనన్యంబైన నాయందలి - భక్తిగల్గిన - బ్రంహవాదు లీరూపం జూడందగుదురు. నీకనన్యంబైనభక్తి- నాయందుగలదుగాన - నీకుంబ్రీతుండనై నీవొనర్చినహవిస్సు భుజింప. వ్యక్తరూపంబునొంది- యేతెంచితి. యీదివ్యవిమానంబు- పుణ్యకోటియను- నామంబునంబరగు- దీనింజూడ- మహాయోగులకైన నలవిగాదు. సకలపాపంబుల నాశనంబుజేయు - నీకుమెచ్చి- యీవిమానంబుజూపితి. యీవిమానమధ్యంబున నుండు- ననుంగాంచువారు- బ్రంహహత్యాదిపాపంబులం బాయుదురు. యిచ్చటననుంగూర్చి యజ్ఞాదులొనర్చినవారికిం బ్రీతుండనగుదు. నీకుదుల్యుండైన-నాభక్తుండెవ్వఁడు లేఁడు.

మమప్రియచికీర్షయా॥ ౧౪ । వరంవృణీష్వభద్రం తేవాంఛితంయత్తవ
యానఘ।తదేవతవదాస్యామిధ్రువంనాస్త్యత్రసంశయః॥ ౧౫॥ నారదః॥
తస్యతద్వచనంశ్రుత్వావిష్ణోరమితతేజసః । ప్రణిపత్యాంజలింబధ్వాత
మాహచతురాననః ॥ ౧౬ ॥ బ్రహ్మ॥ పరిపూర్ణంమయాలబ్ధంవాంఛితం
త్వత్ప్రసాదతః । నచాన్యంనాధమేలబ్ధమేతస్మాదేవదర్శనాత్ ॥ ౧౭ ॥
ఇదంహిపరమంరూపంతవదివ్యంసురేశ్వర । ప్రార్థితంసుచిరంకాలం
లబ్ధమేతన్మయాధునా ॥ ౧౮ ॥ ఇదంహిప్రార్థ్యతేనిత్యంయోగిభిర్విజితేం
ద్రియైః । అనాయాసేనతేలబ్ధంత్వత్ప్రసాదాన్మయాధునా ॥ ౧౯ ॥
త్వద్రూపంద్రష్టుమృషయోమునయస్సంశితవ్రతాః । బ్రహ్మచరంచరంత్య
న్యేసర్వభూతహితేరతాః॥ ౨౦ ॥ త్వాంద్రష్టుకామామునయోచరంతిప
రమంతపః । ద్రష్టుకామామహాయజ్ఞైస్త్వాంయజంతేచయజ్వనః ॥ ౨౧ ॥
ప్రాణాయామాన్ప్రకుర్వంతినిరాహారాద్విజోత్తమాః। తీర్థానిచనిషే
వంతేత్వద్దర్శనసముత్సుకాః ॥ ౨౨ ॥ గంధపుష్పాదిభిర్నిత్యంయజంతే
త్వాందృఢవ్రతాః । పుత్రమిత్రకళత్రేషునిస్పృహాయోగినస్సదా ॥ ౨౩ ॥

---

నీవుగోరినవరంబులెల్ల నిచ్చెద - వేడుము. నిందుకు సందియంబులేదని - ప్రీతుండై- పలుకుచున్న - విష్ణుదేవుంగాంచి - నలువ - ప్రణతుండైయిట్లని యె. ఓదేవదేవా- నీప్రసాదంబున- నాకన్నియు- పరిపూర్ణంబులై - యున్నవి. నీదర్శనంబుకన్న- గోరందగిన నొండువరంబులేదు. నేబహు దినంబులనుండి - దివ్యంబైన- నీరూపంబు - జూడంగోరి యుంటి - నది యిప్పుడుజూడంగల్గె. జితేంద్రియులగు- మహాయోగులు- ప్రార్థింపద గిన నీయీరూపంబ నాయాసంబుగా నేగంటి - సర్వభూతదయాళులైన వారును-బ్రంహజ్ఞానులును- నియమవ్రతులును-పరమతపంబుజేయువారు ను- యజ్ఞంబులొనర్చువారును - ప్రాణాయామపరును- సకలతీర్థసేవ కులును- నియతాహారులును- గంధపుష్పాదులచే నిత్యంబు నినుంబూజిం చువారును- జితక్రోధులు- జితేంద్రియులును- నిర్ద్వంద్వులు. పరిగ్రహ

త్వాంయజంతిజితక్రోధానిర్ద్వంద్వానిష్పరిగ్రహాః । యజ్ఞైర్దానైర్జపై
ర్హోమైస్తపస్స్వాధ్యాయసంయమైః॥ ౨౪॥ తవసందర్శనార్థాయ దేవేం
ద్రస్త్వాముపాసతే । తవసౌమ్యమిదంరూపందుర్లభంసర్వదేహినాం॥
౨౫॥ త్వత్ప్రసాదాన్మయాలబ్ధంకేవలంమధుసూదన । సుతప్తంసుచిరం
కాలంమయాత్వద్దర్శనేచ్ఛయా ॥ ౨౬ ॥ స్వప్నేష్వపినదృష్టంయదిహప్ర
త్యక్షతాంగతం । స్ఫురత్కమలపత్రాక్షపీతవాసశ్చతుర్భుజ ॥ ౨౭ ॥
శ్రీవత్సాంకమహాబాహోసర్వభూతహితేరత। నచాన్యత్ప్రార్థనీయం
మేదుర్లభాత్తవదర్శనాత్। నహ్యలబ్ధంమయాకించిదధునామధుసూదన॥
౨౮ ॥ ఇదమప్రార్థనీయంమేయదిమయ్యస్త్యనుగ్రహః । సర్వలోకహి
తంనాథదుర్లభంచజగత్త్రయే॥ ౨౯॥ తవదివ్యమిదంరూపంసర్వభూ
తాభయప్రదం। ఫుల్లేందీవరసంకాశంపీతాంబరధరంశివం॥ ౩౦॥ దేవ
తిర్యఙ్మనుష్యాణాంసదాప్రత్యక్షగోచరం । అత్రతిష్ఠతుదేవేశహస్తిశైల
స్యమూర్ధని॥ ౩౧॥ వైకుంఠేతుయథైవస్యాద్యథైవక్షీరసాగరే । తథా
సత్యవ్రతక్షేత్రేవాసస్తేత్రభవేదహ॥ ౩౨॥ హస్తిశైలస్యశిఖరేసర్వలోక
నమస్కృతే । పుణ్యకోటివిమానేస్మిన్ పశ్యంతుత్వాంసదాసురాః॥౩౩॥

---

పరాఙ్ముఖులును - తపోహోమ స్వాధ్యాయపరులును - వీరలెల్ల - నిన్నుఁ
జూడంగోరుచుందురు. నిన్నుంజూచుటకై - దేవేంద్రుం డీడవచ్చియున్న
వాఁడు. నెల్లవారికిం- దుర్లభంబయి - సౌమ్యంబగు- నీరూపంబేగంటి-
నాతపంబీడేరె. స్వప్నంబందైన- నిట్టిరూపంబే నెన్నఁడుంజూచియెరుం
గ. ఓకమలపత్రాక్షా - ఓచతుర్భుజా - నీదర్శనంబుకన్న మరియొండు
వరంబు వేడఁజాల. నైననొకటిం గోరెద. నాపై - యనుగ్రహంబు
గలదేని- వినుము. దివ్యంబయిన - యీరూపంబుతో - సర్వలోకహితం
బుగా- దేవతిర్యఙ్మనుష్యాదులకుం బ్రత్యక్షగోచరుండవై- సకలభూతా
భయప్రదుండవై- వరదుండనంబరగి- యీసత్యవ్రతక్షేత్రంబున- యీ
హస్తిశైలంబుపై- యీపుణ్యకోటివిమానంబుతోడ- వైకుంఠంబునందు
ను- పాలకడలియందున్నవిధంబున- నుండుము. దేవతలెల్ల నిన్నుంగో

చతుర్బాహుముదారాంగం వనమాలావిభూషితం । వరదం సర్వభూ
తానాం సర్వైశ్వర్యసమన్వితం ॥ ౩౪ ॥ అత్రైవ ద్రష్టుకామా మాం సమాగ
చ్ఛంతి మానవాః । సర్వపాపవినిర్ముక్తాస్తే యాంతు పరమం పదం॥౩౫॥
ఇత్థం సంప్రార్థితస్తేన వరదో వేదిమధ్యగః । ప్రసన్నవదనశ్శ్రీమానిద
మాహ మహామునే॥ ౩౬॥ శ్రీభగవాన్॥ ప్రార్థితం యత్త్వయా బ్రహ్మన్
తద్దత్తమధునా మయా । యేన యత్ప్రార్థితోఽహం తస్య తద్భవితా
ధ్రువం॥ ౩౭॥ అభివ్యక్తోఽహమత్రైవ కేవలం త్వత్కృతేఽధునా। త్వదారా
ధనసంతుష్టః కిం ప్రదాస్యామి సువ్రత॥ ౩౮ ॥ అత్రాహం నివసిష్యామి త్వ
త్ప్రియార్థం పితామహ। వాంఛితం సర్వభూతేభ్యో దాస్యామి చ సుపూ
జితః ॥ ౩౯ ॥ యే యజంతేఽత్ర మాం నిత్యం శ్రద్ధాభక్తిసమన్వితాః । తే ల
భంతేప్సితాన్కామాన్మమైతదనుశాసనం ॥ ౪౦ ॥ యత్రకుత్రవసన్వాపి
ధార్మికోఽధార్మికోఽపి వా । మాం స్మరన్పుణ్యకోట్యంతః సర్వపాపైః
ప్రముచ్యతే ॥ ౪౧ ॥ అయనాదిషు కాలేషు పుణ్యేషు యతమానసః । మాం
స్మరన్పుణ్యకోట్యంతస్సముక్తస్సర్వకిల్బిషైః॥ ౪౨॥ యస్త్రిరాత్రముపో
ష్యాత్ర మామర్చయతి భక్తితః । కృతకృత్యస్తు సహసా బ్రహ్మహత్యావ్యపో

---

ల్చుచుందురు. మానవులెల్ల- నిన్నుం గాంచి- కృతార్థులయ్యెదరని వేడు
చున్న. వరదుండు - ప్రసన్నుండై - నలువం గాంచి - యిట్లనియె. ఓప
ద్మజా- నీగోరినట్ల-వరంబిచ్చితి. నీప్రీతికై నేనిందభివ్యక్తవిగ్రహుండనై
యెవ్వం డేదిగోరిన - దానినెల్లనిచ్చుచు - సర్వలోకపూజితుండనై యుం
డెద. యేనరులైన - శ్రద్ధాభక్తులచే - ననుం బూజింతురు. వారెల్ల కో
రికలంబొందుదురు. జనుండు- ధార్మికుండైనను- అధార్మికుండై
నను- యచ్చటనైననుండి- నీపుణ్యకోటివిమానంబుననుండు- నన్నుస్మరిం
చు- నాతండెల్ల పాపంబులంబాయు- అయనాదిపుణ్యకాలంబుల- నియ
తమానసుండై- నన్నుస్మరించువానికి- పాపంబులెల్లనశించు. యేజనుం
డైన- యీక్షేత్రంబుజేరి- త్రిరాత్రోపవాసంబుండు నాతండు- బ్రంహ

హతి॥ ౪౩॥ హేమరత్నాదికం ధాన్యం వస్త్రభృత్యపశూనపి । క్షేత్రోద్యా
నాదికం వాపి పత్రపుష్పఫలాదికం॥ ౪౪ ॥ దదాతి శ్రద్ధయా మహ్యమస్మిన్
క్షేత్రే తు మానవః । ప్రతిగృహ్ణామి తత్సర్వమహమత్యంతగౌరవాత్॥ ౪౫॥
తేభ్యో దదామ్యభీష్టాని ఫలాని చ పితామహ । యత్ర చేత్ప్రాతరుత్థాయ మ
మ క్షేత్రమిదం నరః । పురీమిమాం చ సనరో ముచ్యతే సర్వకిల్బిషైః॥ ౪౬ ॥
సత్యవ్రతమిదం క్షేత్రం సతతం యస్తు కీర్తయేత్ । మమలోకం సమాప్నో
తి న చేహ జాయతే పునః॥ ౪౭॥ మత్సమారాధనే యేయం నిర్మితా మహతీ
పురీ । అతస్సర్వపురీణాం చ పుణ్యశ్లోకా భవిష్యతి॥ ౪౮ ॥ జాతో వాత్ర మృ
తో వాపి పాపానామతి పాపకృత్ । మమలోకమవాప్నోతి న పునర్భవమృ
చ్ఛతి॥ ౪౯॥ శ్వఃఖరోష్ట్రమృగవ్యాళపశుపక్షిసరీసృపాః। అస్మిన్ క్షేత్రే
సముత్పన్నా మద్భక్తిం యాంతు నైష్ఠికీం॥ ౫౦ ॥ శ్రద్ధయాశ్రద్ధయా వాపి క
ర్మ యత్క్రియతే త్వత్ర వై । తత్సర్వం ఫలదం తస్య న కదాచిద్వినశ్యతి॥ ౫౧॥
రూపమేతిమయా వ్యక్తం పురా స్యత్రైవ తిష్ఠతి ॥ నిత్యం సన్నిహితో స్మ్యత్ర
యథాహం క్షీరసాగరే॥ ౫౨॥ అత్రైవార్చ్యయతే నిత్యం శేషఃఫణభృతాం

---

హత్త్యాదులం బాయు- యేమానవుండయినను- ధనకనకవస్తు వాహన క్షే
త్రోద్యానాదికంబుల-పత్రపుష్పాదుల శ్రద్ధచే నీక్షేత్రంబున - నాసంగు
దానినెల్ల-నేఁబ్రియంబునం గ్రహించి- వానియభీష్టంబులెల్ల నిత్తు-జనుండె
చ్చటనుండిన్మైన ప్రాతఃకాలంబున లేచి- ఈ క్షేత్రంబును- యీపురఁబు
ను స్మరించుచుండు నాతండు మదీయలోకంబు జేరి-మరల జన్మాదులంబొం
దడు. నన్నుంబూజింప నీపురంబు నిర్మించితివి గాన నీపట్టణంబెల్ల పు
రంబులకు శ్రేష్ఠంబై యుండు-ఇందుబుట్టినవారైనను-జచ్చినవారైన- వా
రలెట్టి పాపాత్ములైనను-నాలోకంబున కేగుదురు- ఇచ్చటంబుట్టిన శ్వాన-
ఖర-వ్యాళ- పశు-పక్షిమృగాదులైన మద్భక్తిగల్గి ముక్తింబొందు- జనుం
డీక్షేత్రంబున నశ్రద్ధచేనైన - శ్రద్ధచేనైన - గావించిన కర్మంబనంత
ఫలంబునిచ్చు- పాలసముద్రంబుననున్న విధంబున-నిత్యంబునన్నిహితుం

వరః। త్వత్కృతేనివసామ్యత్రనమాంద్రక్ష్యంతిమానవాః॥ ౫౩॥ అస్మిన్
గిరివరేపూర్వందిఙ్నాగాఃకిలధావితాః। గంధపుష్పాదిభిర్దివ్యైర్భ
క్త్యైమామభ్యపూజయన్ ॥ ౫౪ ॥ పురావరాహరూపేణధరణీయంమ
యోద్ధృతా। తస్మైర్నిహత్యదైతేయాన్ పాతాళతలవాసినః॥ ౫౫॥ తదా
మాంద్రష్టుకామోయమనంతోలోకధారకః। "అత్రైవవసుధాంభిత్వా
సముత్తస్థౌరసాతలాత్ ॥ ౫౬ ॥ తదాప్రభృతివిఖ్యాతమేతత్పుణ్యజలంస
రః। అనంతతీర్థమిత్యేతత్ సర్వపాపవినాశనం॥ ౫౭ ॥ నివసత్యత్రవ
ల్మీకేపన్నగేంద్రోమమప్రియః। తదాప్రభృతితీర్థస్యసఏవాస్యాధిదైవ
తం॥ ౫౮॥ అనంతసరసిస్నాత్వామామర్చయతియోనరః। ససర్వైఃపూ
జ్యతేలోకేదేవగంధర్వదానవైః॥ ౫౯॥ సత్యవ్రతంసత్యఫలప్రదమేతత్పి
తామహ। పుణ్యానామపిసర్వేషాంపావనంసిద్ధసేవితం॥ ౬౦॥ ఇదానీం
సన్నిధానేనవిమానస్యాస్యభాస్వతః। అశ్రద్ధయాకృతంవాపిబధ్యతేక
ర్మకోటిభిః॥ ౬౧॥ నిత్యంసన్నిహితోత్రాహంప్రత్యక్షోనైవకస్యచిత్।
త్వయాహందృష్టవానత్రప్రత్యక్షేణపితామహ ॥ ౬౨ ॥ అభివ్యక్తోహమ

---

దనై యిందుండెద - పూర్వంబున - దిగ్గజంబులిందులకేతెంచి - గంధ
పుష్పాదుల ననుంబూజించె - నే వరాహరూపంబునొంది రసాతలంబు
ననుండు రక్కసులనుక్కడించి - భూదేవినుద్ధరించి నిందులకేతెంచితి -
నప్పుడనంతుండు ననుం బూజించుటకై పాతాళంబున నుండి భూవి
పాటనంబు జేసి కొనివచ్చి - ననుంగాంచె- నాదినంబుమొదలీ వివరంబ
నంత తీర్థంబని ఖ్యాతినొంది - సర్వపాపహారియై పుణ్యజలపూరితంబై
యున్నయది - నిందొకవల్మీకంబున - నాకుంబ్రియుండును నీతీర్థాధిదైవ
తంబైన - పన్నగేంద్రుండున్నవాడు - యేనరుండైన నీసరోవరంబునం
గ్రుంకెనేని - నాతం డుసర్వలోక పూజ్యుండగు - నీ క్షేత్రంబు - సత్యవ్ర
తంబనునది- సకలపుణ్యంబులనిచ్చుచు- సిద్ధసేవితంబై యుండు - నిందెప్పు
డు పుణ్యకోటి విమానంబుపై - నే సన్నిహితుండనై యుందుంగాన- జ

త్తైత్రివహవిగ్రహణతత్పరః । త్వత్ప్రియార్థంత్వయాతస్మాత్తారితం భువనత్రయం ॥ ౬౩ ॥ దేవామనుష్యాఃపశవోమద్భక్తామేపితామహ । త్వామర్చయంతుతేసర్వేమమైతదనుశాసనం ॥ ౬౪ ॥ క్రతుశేషంత్విదానీంత్వంయజస్వయతమానసః । నమేయజ్ఞేనసదృశంపూజనంవిద్యతేబ్జజ॥ ౬౫॥ దేవతిర్యఙ్మనుష్యాణామహంప్రత్యక్షతాంగతః। అత్రైవనివసిష్యామిసత్యమేతద్బ్రవీమితే॥ ౬౬॥ ఆగతాశ్చాత్రయేబ్రహ్మన్నశ్వమేధదిదృక్షవః । మత్ప్రియాస్తేచసంసిద్ధింలభంతేత్రనసంశయః॥ ౬౭॥ ప్రణతార్తిహరేత్యేవంసతతంకీర్తయస్వమాం। వినశ్యంతిచదుఃఖానివివర్ధంతిసుఖానిచ॥ ౬౮॥ చైత్రమాసేసితేపక్షేచతుర్దశ్యామనన్యధీః । మామేవాభ్యర్చయాత్రత్వంవేదీమధ్యేవ్యవస్థితం॥ ౬౯॥ మాధవేమాసినక్షత్రేశ్రవణేపుణ్యవర్ధనే । అనంతసరసిస్నాత్వాయేమాంద్రక్ష్యంతిమానవాః ॥ ౭౦ ॥ సతతంమాంనమస్యంతఃకథయంతశ్చమత్కథాః । జన్మబంధవినిర్ముక్తాఃతేయాంతిపరమాంగతిం॥ ౭౧॥ ఆషాఢశుక్లద్వాదశ్యామర్చయంతిచయేనరాః । చతురష్వేషుమాసానామత్సామ్యంయాంతితేధ్రువం ॥

---

నుండెచ్చట- నశ్రద్ధచేనైనం జేసిన కర్మంబులనేకకోటి గుణితంబై ఫలంబిచ్చుచుండు- నీకొరకై నేవ్యక్తరూపంబున - హవిర్గ్రహణంబాచరింపవచ్చితి - గానలోకంబులెల్ల ననుంగాంచి -పవిత్రంబులగు సకలదేవముని మనుష్యాదులగు నాభక్తులెల్ల - నినుంబూజింపుచుందురిది - నాచేసిన మర్యాద - నీవింకనీక్రతు పూర్తింజేయు- మేనిందెల్లవారలకుం-ప్రత్యక్షరూపంబున - నభిమతసుఖంబులొసంగుచునుండెద - నీయశ్వమేధంబు జూడనేతెంచినవారెల్ల - నాకుంబ్రియులై - సకల సిద్ధులంబొందుదురిందుకు సందియంబులేదు. ప్రణతార్తిహరుండనైన - ననుంబూజింపుము - నీకుంగల దుఃఖంబులెల్ల నశించి సుఖంబులు గల్గు- నీవెల్లప్పుడు చైత్రమాస శుక్లపక్ష చతుర్దశినాడిందుండు ననుంబూజింపుము - యేనరుండైన మాధవమాసంబున - శ్రవణ నక్షత్రంబున - నీయనంత

౭౨॥ ఏకరాత్రం త్రిరాత్రం వా సప్తరాత్రమథాపి వా । నివసేద్యస్స సహసా ముచ్యతే సర్వకిల్బిషైః ॥ ౭౩ ॥ బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోథ భిక్షుకః । పూజయిత్వా త్రిమామేవ ముచ్యతే మహతో భయాత్ ॥ ౭౪ ॥ నారదః ॥ ఇత్యుక్తో దేవదేవేన కృతకృత్యః పితామహః । ప్రణమ్య శిరసా భూమావచనం చేదమబ్రవీత్ ॥ ౭౫॥ బ్రహ్మా॥ ధన్యోస్మ్యనుగృహీతోస్మి సర్వం లబ్ధమిహాత్మనా । త్వయి ప్రసన్నే దేవేశే దుర్లభం నైవ విద్యతే ॥ ౭౬ ॥ గృహాణ మత్కృతాం పూజాం మదనుగ్రహకామ్యయా । అపేక్షా భవతో నైవ విద్యతే కేనచిత్ప్రభో ॥ ౭౭ ॥ నారదః॥ ఇత్యుక్త్వా శిరసా బ్రహ్మా భక్తిపూతేన చేతసా । అర్చయామాస దేవేశం వరదం భక్తవత్సలం ॥ ౭౮॥ పంచరాత్రోక్తమార్గేణ విధిం పరమపావనం । గంధపుష్పాదిభిర్దివ్యైర్భావశుద్ధైర్మనోరమైః ॥ ౭౯॥ పంచరాత్రవిధిః ప్రోక్తస్సర్వామ్నాయసమన్వితః । విధిమోక్షప్రదః శుద్ధస్సిద్ధికృత్సర్వదేహినాం ॥ ౮౦ ॥ తేనమార్గేణ వరదం వేదిమధ్యవ్యవస్థితం । రాజోపచారైర్వివిధైః పూజయామా

---

సరోవరంబున స్నానంబు జేసి నను బూజించి నాకథలు విను - నాతండఖిల జన్మబంధంబులం బాసి పరమగతి నొందు యేనరుండైన ఆషాఢశుద్ధ ద్వాదశి నాడిందు ననుం బూజించు నంతండు సంవత్సరంబెల్ల నాపూజ గావించిన ఫలంబు నొందు- మనుజుండొక రాత్రియందైన-మూడు రాత్రులైన- యేడు రాత్రులైన నిందుం డేనేని సకలపాపంబులం బాయు బ్రహ్మచారియైన- గృహస్థుండైన- వానప్రస్థుండైన- భిక్షుకుండైన నిందున్న ననుం బూజించిరేని- వారలు సకల భయంబులం బాయుదురని- వరదుండు వచించిన విని ప్రీతుండై పితామహుండనేక వందనంబులాచరించి కృతకృత్యుండై యిట్లనియె. ఓ దేవదేవా- నేధన్యుండనైతి- నీవు ప్రసన్నుండవైన - జనులకు - దుర్లభంబేదిగలదు - నీకిష్టంబుగలదేని నేనొనర్చిన పూజం గ్రహింపుమనుచు-భక్తిచే బ్రణతుండై బ్రహ్మదేవుండు- భక్తవత్సలుండైన వరదుని- పరిశుద్ధంబులు- మనోహరంబులైన-గం

సపద్మకాః ॥ ౮౧ ॥ తతోవిజ్ఞాప్యభూతానామీశ్వరాయపితామహః ।
ఉద్ధ్యానశేషమఖిలంచక్రేచసమహర్షిభిః॥ ౮౨ ॥ అతిరాత్రాహ్ణికంక
ర్మతతశ్చక్రుర్యథావిధి । సమాహితధియోభూత్వాఋత్విజఃపరమపా
వనాః॥ ౮౩॥ తత్పాదాంభోరుహాధారజ్వలనేచసముజ్జ్వలే।జుహ్వాయాం
చక్రిరేసర్వేహవీంషిమునయస్తథా ॥ ౮౪ ॥ త్రిదశామునయస్సిద్ధావసు
ష్యాశ్చసమాగతాః । తద్ధవిస్సర్వమశ్నంతంవరదందదృశుస్తదా॥ ౮౫॥
తతస్తంతుష్టువుస్సర్వేహావిర్గర్భముఖంహరిం। కృతాంజలిపుటాస్థిత్వా
సంపశ్యంతోహరింమునే ॥ ౮౬ ॥ జ్యోతిష్టోమాతిరాత్రౌచఅభిజిద్విశ్వజి
త్తథా । ఆప్తోర్యామశ్చవిధివన్నివృత్తాస్తైమహర్షిభిః ॥ ౮౭ ॥ ఇత్థంక
ర్మాణిసంపూర్యసర్వాణిమునిసత్తమైః । ఋత్విగ్భ్యశ్చతతోబ్రంపకఃస
మృద్ధాందక్షిణాందదౌ ॥ ౮౮ ॥ సదస్యేభ్యస్తథాన్యేభ్యఃబ్రాహ్మణేభ్యః
పితామహః । ప్రదదౌధనధాన్యానివస్త్రాణ్యాభరణానిచ ॥ ౮౯ ॥ చతు
ర్ధాకృత్యవసుధామృత్విగ్భ్యఃప్రదదౌక్రమాత్ । గవాంశతసహస్రాణి

---

ధ పుష్పాదులచే- నామ్నాయసమన్వితంబై- సకలసిద్ధిప్రదంబై- మోక్ష
కారియై- వెలయు- పంచరాత్రోక్తవిధిచే- సకల రాజోపచారంబుల-
బూజించి- యామహాదేవు ననుజ్ఞగొని- మహర్షులంగూడి యజ్ఞశేషం
బు పూర్తిగావించె. నంత ఋత్విజులు మునులతోడంగూడి- అతిరాత్రం
బాహ్నికంబు మొదలగు వానినెల్ల విధివంతంబులుగా జేసి- తత్పాదాం
బురుహాధారంబై- సముజ్జ్వలజ్వాలంబై యొప్పుచున్న హుతాశనునందు-
హవిస్సులొనరించిరంత- వరదుండా హవిస్సులెల్ల భుజింపుచుండె-వా
నింజూడ సకల దేవముని సంఘంబులు- మనుష్యులువచ్చి కృతాంజలులై
యాదేవదేవుం జూచుచుండిరంత నలువ మునిగణంబులం గూడి- యగ్ని
ష్టోమాతి రాత్రంబుల- అభిజిద్విశ్వజిత్తుల- అప్తార్యామంబుల- విధి పూ
ర్వకంగా పూర్తిగావించి ఋత్విక్కులకు సమృద్ధదక్షిణలిచ్చి సదస్యుల
గు బ్రాహ్మణులకెల్ల ధనధాన్య వస్త్రాభరణాదులొసంగి- భూమినెల్ల

నియుతాన్యయుతానిచ ॥ ౯౦ ॥ తతస్తామృత్విజస్సర్వేవసుధాంచపశూ
నపి । ప్రదదుర్దేవరాజస్యచరణాంబుజయోర్ముదా ॥ ౯౧ ॥ ఇత్థమారా
ధ్య దేవేశంహయమేధేనకేశవం । దేవర్షిగణసంయుక్తశ్చక్రేవబృథమ
బ్జభూః ॥ ౯౨ ॥ తదా దేవర్షిభిస్సార్ధంకృతకృత్యో౽పి తామహః । నిర్య
యౌయజ్ఞశాలాయాఃస్నానార్థమృషిభిస్సహ ॥ ౯౩ ॥ ఉదక్పశ్చిమదిగ్భా
గేవేద్యాస్త్రింశద్ధనుర్మితే । అనంతసరసిస్నాతుంమనశ్చక్రేమహామనాః ॥
౯౪ ॥ ప్రసన్నసలిలేపుణ్యేగంభీరేపుణ్యవర్ధనే । లోలకల్లోలవిలసత్కాం
చనాంబుజకాననే ॥ ౯౫ ॥ రాజహంససమాకీర్ణేమత్తకారండసంకులే ।
మత్తషట్పదసన్నాదనిమిత్తాశేషకిన్నరే ॥ ౯౬ ॥ మహావరాహదేవేశం
ద్రష్టుకామోరసాతలాత్ । నిర్యయౌతత్రభగవాననంతఃపన్నగేశ్వరః ॥
౯౭ ॥ తీర్థేతస్మిన్మహాపుణ్యేసిద్ధసంఘనిషేవితే । సమాహూతానిసర్వా
ణితీర్థానిమునిభిస్తదా ॥ ౯౮ ॥ తానిసర్వాణిసరసిసంగతానిస్వయంత
దా । ఉదతిష్ఠత్తదాగంగాప్రసన్నసలిలోద్వహా ॥ ౯౯ ॥ ప్రాప్పూర్వంతత

---

నాల్గు భాగంబులుగా- భాగించి ఋత్విజులకనేక- గోదానయుతంబుగా
నిచ్చిన- వారలు ప్రీతులై- నాభూమినిం గోవులనెల్ల- దేవరాజైన వర
దరాజునకిచ్చిరి. ఇవ్విధంబున నలువ- హయమేధంబొనరించి- కృతకృ
త్యుండై- దేవర్షిగణంబులంగూడి- యవబృథ స్నానంబు జేయ- నాయజ్ఞ
శాలవెడలి- యుదక్పశ్చిమ భాగంబున- ముప్పదివిండ్లదూరంబున- ప్రస
న్నసలిలంబులుగలిగి- పుణ్యవృద్ధి జేయుచు- తరంగంబులవెలుంగు కాం
చనకమలంబులుగల్గి- రాజహంససేవితంబై - మత్తకారండవాకులంబై -
యొప్పుచున్న యనంతతీర్థంబు జేరెనదిపూర్వంబున-మహావరాహరూ
పుండైన- విష్ణుదేవుని సేవింప పన్నగేంద్రుండైన- యనంతుండు పాతా
ళంబున- నుండివచ్చిన చోటుగాన యనంతతీర్థంబనంబరగె- నట్టిసరో
వరంబున కెల్ల- వారలు నేతెంచిరంత- మునీంద్రులు- సర్వతీర్థంబుల-నా
హ్వానంబు జేయ- గంగాదినదులెల్ల- ప్రసన్నజలోపేతంబులై - యా య

గాయోమహానాగాహ్వయం సరః । తాం దృష్ట్వా విస్మితాస్సర్వే గంగాలభువనపావనీం ॥ ౧౦౦ ॥ ప్రణేముః ప్రీతమనసః ప్రశంసంతః పరస్పరం । హేమకుంభాత్సమాదాయ గంగాసలిలమబ్జభూః ॥ ౧౦౧ ॥ అభ్యషించత్తతో భక్త్యా వరదం వేదిమధ్యగం । పునః ప్రక్షాళ్య సలిలైస్తత్పాదాంబురుహద్వయం ॥ ౧౦౨ ॥ ఋత్విగ్భ్యశ్చాథ దేవేభ్య ఋషిభ్యశ్చ తదాదదౌ । తతో నాగాహ్వయం తీర్థం సర్వతీర్థసమన్వితం ॥ ౧౦౩ ॥ పశ్యంతో మునయస్సర్వే ప్రశంసుశ్చ పరస్పరం । అత్రిః - అస్మిన్ సరసి యస్స్నాత్వా ॥ పూజయేద్వరదం హరిం । సర్వ పాపవినిర్ముక్తస్సయాతి పరమం పదం ॥ ౧౦౪ ॥ పులస్త్యః- అస్మిన్ నాగాహ్వయే తీర్థే స్నాత్వా భక్తిపురస్సరం । వరదం ప్రణమేద్భక్త్యా ముచ్యతే సర్వపాతకైః ॥ ౧౦౫ ॥ బృహస్పతిః ॥ అస్మిన్నాగాహ్వయే తీర్థే యస్స్నాయాదవశోపి సః । సముక్తస్సర్వపాపేభ్యః భవితా పుణ్యకృద్ధ్రువం ॥ ౧౦౬ ॥ వసిష్ఠః ॥ యస్మిన్నవభృథస్నానం చకార చతురాననః । తస్మిన్ సరసి యస్స్నాయాత్స ముక్తస్సర్వకిల్బిషైః ॥

---

నంత తీర్థంబు జేర- నా సరోవరంబధిక జలంబుచే వెలుంగె. దానిం జూచి- మునులెల్ల ప్రీతులై యుండ- నలువయానందంబున- సువర్ణకుంభంబున నాజలంబుగొనివచ్చి- వరదుని పాదంబులుగడిగి- అభిషేకంబు జేసె. నెల్లవారు నాతీర్థంబున మునింగి- యాప్రభావంబు పరస్పరంబు జెప్పుచుండ- నత్రి యిట్లనియె. యేనరుండైన నీతీర్థంబున- స్నానంబు జేసి- వరదుం బూజించు- నతండు సర్వపాపంబులం బాసి- పరమపదంబు జేరు ననియె- నంత పులస్త్యుండిట్లనియె. ఈ యనంతతీర్థంబున - భక్తి మునింగి- వరదుని సేవించినవానికి- సకలపాపంబులు- నశించుననియె- బృహస్పతి- యీతీర్థరాజంబు ననవశుండైన గ్రుంకెనేని- యాతండధిక పుణ్యాత్ముండగుననియె- నంత వసిష్ఠుండు- యీతీర్థంబున- చతురాననుండవబృథస్నానంబు జేసెంగాన- నిందు స్నానంబు జేసినవారెల్ల- పాపంబులం బాయుదురనియె. నివ్విధంబున వారెల్ల బలుకుచుండ - పితామ

౧౦౭॥ నారదః॥ ఇత్యుక్త్వామునయస్సర్వేతస్మిన్ సస్నుర్యథావిధి। విమానంపుణ్యకోట్యాఖ్యం వీక్షమాణాముహుర్ముహుః॥ ౧౦౮॥ పద్మయోనిశ్చ తైస్సార్ధం నాగతీర్థే విగాహ్యచ। దధ్యౌపద్మపలాశాక్షంపశ్చిమాభిముఖంహరిం॥ ౧౦౯॥ కృతకృత్యస్తతోబ్రంహాప్రాప్తసర్వమనోరథః। వరదంసర్వభూతానాంసమారాద్ధుంప్రచక్రమే॥ ౧౧౦॥ తతోదేవమనుష్యాద్యాస్సమాహూతాశ్చయేజనాః। విధాత్రాసమనుజ్ఞాతాఃప్రయయుస్తేయథాగతం॥ ౧౧౧॥ బ్రహ్మణశ్చరితంసర్వమావిర్భావంతథాహరేః। ఆశ్చర్యంప్రయయుఃప్రీతాఃప్రశంసంతఃపరస్పరం॥ ౧౧౨॥ అథసరసిజసంభవఃకృతాత్మాసురవరమౌళివిరాజితాంఘ్రియుగ్మం। వ్యవసితమతిరగ్ర్యగంధపుష్పైర్వరదమపూజయదాత్మయోనిరీశం॥ ౧౧౩॥

ఇతి బ్రాహ్మ్యేపురాణే భృగునారదసంవాదే హస్తిగిరి
మాహాత్మ్యే అశ్వమేధావభృథస్నానంనామ
నవమోధ్యాయః.



---

హంసంఘాములనులంగూడి- అవభృథస్నానంబుజేసి-కృతకృత్యుండై- సంప్రాప్త సర్వమనోరథుండై- యావరదుంబొగడుచుండ- నాయజ్ఞంబుజూడనేతెంచిన- సురమనుజాదులెల్ల - నాపితామహునిచే ననుజ్ఞగొని - యామహానియ్యాని చరితంబును - వరదుని యావిర్భావంబునుం - పరస్పరంబు జెప్పుచు యథేచ్ఛంబోయిరి. అంతసరసిజభవుండు - ఏకాగ్రచిత్తుండై- దేవదేవుండైన వరదుని- గంధపుష్పాదులం బూజింపుచుండెను.

ఇది బ్రాహ్మ్యపురాణంబునందు - భృగునారదసంవాదంబున-
హస్తిగిరి మాహాత్మ్యంబునందు - బ్రంహ్మదేవుని
అశ్వమేధావభృథస్నాన రూపంబైన
తొమ్మిదవయధ్యాయము.



భృగుః ॥ భగవన్ పుణ్యకోట్యంత వరదం వేదిమధ్యగం । కియంతం కాలమేకాగ్ర్యః పూజయామాస పద్మభూః ॥ ౧ ॥ నారదః ॥ యావత్త్రేతాయుగప్రాప్తి స్తావద్బ్రహ్మాభ్యపూజయత్ । జితేంద్రియో జితక్రోధో యతవాక్కాయమానసః ॥ ౨ ॥ దివ్యైర్భోగైర్దివా నక్తం స్తుతిభిర్వందనైరపి । ధ్యానైః ప్రదక్షిణైర్జప్యైః స్తోషయామాస కేశవం ॥ ౩ ॥ తతః కృతయుగే తీతే ప్రాప్తే త్రేతాయుగే హరిః । పితామహమువాచేదం వచనం ప్రీతిపూర్వకం ॥ ౪ ॥ శ్రీభగవాన్ ॥ త్వయాత్రైవ చిరం కాలం పూజితోఽహం పితామహ । అనన్యేనైవ యోగేన దుర్లభేనైవ యోగినాం ॥ ౫ ॥ అతస్తవ ప్రసన్నోఽస్మి వృణీష్వవ మీప్సితం । వరదానాయ సర్వేషా మత్రైవాహం వ్యవస్థితః ॥ ౬ ॥ బ్రహ్మ ॥ అత్ర సర్వం మయా లబ్ధం త్వత్ప్రసాదాత్సుదుర్లభం । నచాస్తి ప్రార్థనీయం మే కృతార్థోఽస్మి జగద్గురో ॥ త్వయ్యేవ వర్తతే నాథ మచ్చిత్తమనియంత్రితం । కిమన్యత్ప్రార్థనీయం మే త్వత్పాదాంభోరుహస్మృతేః ॥ ౭ ॥ త్వత్ప్రసాదాచ్చిరం కాలం తపస్త

---

భృగువు నారదుంజూచి ఓ మునీంద్రా- పద్మభవుండెంత కాలంబు- వరదుం బూజింపుచుండె- నెరుంగింపవేయనిన- నారదుండిట్లనియె. ఓ మహాత్మా- వినుమట్లు - నలువ జితేంద్రియుండై- యతవాక్కాయమానసుండై- క్రోధంబుమాని- దివ్యభోగంబుల- రాత్రింబగళ్ళు- ప్రదక్షిణ నమస్కారంబులు - స్తుతులు గావింపుచు - నా దేవదేవుం బూజింపుచుండ- కృతయుగంబు పూర్తియై- త్రేతాయుగంబు వచ్చెనంత- విష్ణుదేవుండు ప్రీతిపూర్వకంబుగా- పితామహునితో నిట్లనియె. ఓ చతుర్ముఖా- నీవనేకదినంబులునుండి- యోగి దుర్లభంబైన-భక్తిచే - నను బూజించితివి- గాన నే ప్రీతుండనైతి- నీకిష్టంబైన వరంబు వేడు మిచ్చెద- నెల్లవారికి- వరంబులొసంగ- నిందున్నవాడ- ననిన బ్రహ్మ యిట్లనియె. వో మహాత్మా నీప్రసాదంబున- నాకన్నియు సమృద్ధంబుగానున్నది - నే కృతార్థుండనైతి- నేగోరందగినది- యొండులేదు- నేబహుకాలంబు- తపంబు గావిం

ష్టంసుదుష్కరం । తతస్త్వేపరమంరూప మీదృశంద్పుష్ట వానహం॥౯॥ ప్రార్థనీయమిదంనాథ యదిమయ్యస్త్యనుగ్రహః । అత్రైవత్వత్పదాంభోజ పరిచర్యాంప్రసీదమే ॥౧౦॥ త్వత్పాదకమలాదన్యం నైవవాంఛతి మేమనః । త్వద్దర్శనసమాహ్లాద సదృశంనాస్తికించన ॥౧౧॥ అతోఽత్ర నివసిష్యామి త్వత్పాదకమలాశ్రయః । బ్రహ్మలోకనివాసోమే త్వయాహీనోనరోచతే ॥౧౨॥ నారదః ॥ ఇత్యుక్త్వాశిరసాబ్రహ్మా వందయిత్వాజనార్దనం । తత్పాదాంభోరుహద్వంద్వం ప్రతిజగ్రాహబాహుభిః - తమువాచజగన్నాథః పద్మపత్రనిభేక్షణః । అనాదిర్జగతోహేతుః స్థావరస్యచరస్యచ ॥౧౪॥ శ్రీభగవాన్ ॥ సర్గస్థితివినాశాశ్చ లీలైవజగతో మమ । నమేస్తికారణంకించిత్కార్యంవాపికదాచన ॥౧౫॥ త్వమేవభూత్వాసర్గాదౌ సృజామిభువనాన్యహం । చరస్థిరవిభాగేన ప్రతిభిన్నాన్యనేకశః ॥ ౧౬ ॥ యజ్ఞయోనిరనంతాత్మా దుర్విజ్ఞేయస్సనాతనః । అహమింద్రానుజోవిష్ణుః జాతస్తదనుపాలనే ॥ ౧౭ ॥ అచింతమహిమవ్యాపీ

---

చిన కతంబున- నీరూపంబు స్పృశింప నర్హుండనైతి- నీపాదస్మరణంబుకన్న- నొండువరంబువలదు, నేనిరంతరంబు నిన్నుసేవించుచుండెద- నాయందనుగ్రహంబుగలదేని- నావరంబిమ్ము - నిన్నుంబూజించుచు - నీపాదంబులు సేవించుచుండుటకన్న నీవులేక - సత్య లోకంబున నేనుండుట మేలగునే- యనుచు ప్రణతుండై యావరదుని పాదంబులంబడి-బాహువుల పరిరంభంబొనరించుచుండ- జగన్నాథుండిట్లనియె. ఓ చతురానా- యీలోకంబు లసర్గస్థితి లయంబులు- నాకు లీలలైయుండు-నాదికాలంబున నేనీరూపంబుననెల్ల సృజింపుదు- రుద్రుండనై- వినాశంబు కావింతు- నేననంతుండ - సురాసురాదులకగమ్యుండ- అచింత్యమహిమ గలవాఁడ- నే వామనుండనై యింద్రుంగాచితి- నేన యగ్ని వాయు వరుణ యింద్ర యమ చంద్రాదిరూపంబులం బ్రకాశింతు - సకలదేవతలు॥ మనుజులు- పశుపక్షి వృక్ష తృణ గుల్మాదులు-సర్వంబు- నాయంశంబునం

దుర్విజ్ఞేయస్సురాసురైః । రుద్రోహంశంకరోభూత్వా నాశయామిజగ
త్త్రయం ॥ ౧౮ ॥ అవ్యక్తంచవికారాశ్చ భూతేంద్రియగుణాస్తథా ।
వసవోగ్నిర్యమోవాయు ర్వరుణోధనదస్తథా ॥ ౧౯ ॥ సర్వేదేవాశ్చగం
ధర్వా మనుష్యాయక్షకిన్నరాః । పశవఃపక్షిణోవృక్షా స్తృణగుల్మలతా
దయః ॥ ౨౦ ॥ భూతంభవ్యంభవిష్యచ్చ సర్వంస్థావరజంగమం । సర్వే
మమాంశసంభూతా మత్తోనాన్యంనవిద్యతే ॥ ౨౧ ॥ వర్ణానామాశ్ర
మాణాంచ కర్తాహంకర్మభేదతః । శ్రుతిస్మృత్యుదితంకర్మ కుర్వం
తిమమశాసనాత్ ॥ ౨౨ ॥ నశక్నోతిజనఃకశ్చి న్మదాజ్ఞామతివర్తితుం । పా
తయామియమోభూత్వా మదాజ్ఞాలంఘినోనరాన్ ॥ ౨౩ ॥ అశాస్త్రవి
హితేనైవ మార్గేణగతచేతనః । మామర్చయతియోనిత్యంసనరఃపాతకీ
భవేత్ ॥ ౨౪ ॥ మమప్రీతికరంవిద్ధి మదాజ్ఞాపరిపాలనం । అతిక్రమ్యతు
యోమూఢో మాముపాస్తేహతోహిసః ॥ ౨౫ ॥ శ్రుతిస్మృత్యుదితంకర్మ
మదాజ్ఞాత్యభిధీయతే । మత్కర్మకరణేవాసౌ యస్తస్మిన్ప్రతితిష్ఠతి ॥ ౨౬ ॥
కరోతి పతిషిద్ధాని ధర్మబుద్ధ్యాపియోనరః । సయాతినరకంఘోరం ప
రమజ్ఞానవానపి ॥ ౨౭ ॥ మమప్రియచికీర్షుస్త్వం యదిపద్మసముద్భవ ।
బ్రహ్మలోకమితోగత్వా మదాజ్ఞాంపరిపాలయ ॥ ౨౮ ॥ మత్సమీపనివాస

---

బుట్టు- నేనుగానిది యొకటైనలేదు. వర్ణాశ్రమాచారంబులకు- కర్తనేన
నెల్లవారలు నాయాజ్ఞచే- శ్రుతిస్మృత్యుక్త కర్మంబు లాచరింపుచుందు
రు- యెవ్వండైను నాయాజ్ఞ నుల్లంఘింపజాల - డట్లుజేసినవారి - యంత
కుండనై సంహరింపుదు. యేమానవుండైన శాస్త్రమార్గంబువిడచి- న
న్నుం బూజించినను- నతండు పాతకియగు - నాయాజ్ఞ పాలించుటయే
నాకు ప్రీతికరంబు- నాయాజ్ఞారూపంబులగు శ్రుతిస్మృతి ప్రతిషిద్ధకర్మం
బులు- ధర్మబుద్ధిచాచరించువాడు-పరమజ్ఞానవంతుండైన నరకంబునంబ
డు గావున నోచతుర్ముఖా- నాకుం బ్రియంబుగోరి- నాయాజ్ఞ పాలిం
పుచు- స్వస్థచిత్తుండవై - నన్నుం దలచుచు- బ్రంహలోకంబున కేగ

స్తే మద్భక్తస్సుదుర్లభః । ధీరో భవ మమ ప్రీత్యై జగతాం సర్వకర్మ
సు ॥ ౨౮॥ మద్భక్తో మన్మనా భూత్వా మామేవ సతతం స్మరన్ । బ్రహ్మలో
కే స్వయం స్థిత్వా మదాజ్ఞాం పరిపాలయ ॥ ౨౯ ॥ భవతా నవ్యథా బ్రహ్మ
న్యావదాభూతసంప్లవం । అత్రాహం నివసిష్యామి ప్రళయేష్వపి సర్వ
దా ॥ ౩౦ ॥ గ్రసిత్వా సజ్జగత్సర్వం తదా మాం ప్రాప్స్యసి ధ్రువం । య
స్త్వేవం చరయతి సంయుక్తో నియతాత్మా దృఢవ్రతః ॥ ౩౧ ॥ దేవతిర్యఙ్మనుష్యే
షు మద్భక్తస్సభవిష్యతి । జగతస్సర్గకరణే జ్ఞాపితోసి మయా పురా । త
త్త్రైవ తవ కర్తవ్యా స్థితిమద్దనుశాసనాత్ ॥ ౩౨ ॥ చైత్రమాసే సితేపక్షే
చతుర్దశ్యామిహాగతః । పౌర్ణమాస్యామనన్యాత్మా మాముపాస్వ ది
వానిశం ॥ ౩౩ ॥ విశేషేణ మయా దత్తం తవేదం మమ పూజనం । సమాగ
మ్యేహ లోకేస్మిన్ తద్దినే పూజయస్వ మాం ॥ ౩౪ ॥ ఇయం కాంచీతి విఖ్యా
తా పురీ త్వత్కీర్తివర్ధనీ । మమ ప్రీతికరీ పుణ్యా న కదాచిద్వినశ్యతి ॥ ౩౫ ॥
పుణ్యకోటీతి విఖ్యాతే విమానేస్మిన్ సనాతనే । మామనుస్మరయుక్తాత్మా స
తతం పద్మసంభవ ॥ ౩౬ ॥ సమతీతే కృతయుగే త్రేతాఖ్యస్సముపాగతః ।
ఇతో గత్వా స్వకం లోకం ప్రశాధి భువనత్రయం ॥ ౩౭ ॥ గజేంద్రో నామ

---

న్నిర్మాణ కర్మంబాచరింపుచుండుము. చింతనొందకుము- నే సర్వకా
లంబునింద యుండెద- ప్రళయకాలంబున- సర్వంబు లీనంబయిన- నన్నుం
జేరగలవాడవు పొమ్ము ధీరుండవై యుండుము- పూర్వం బేనియమించిన
ట్లు- ప్రజాసర్గంబు జేయుచు- సకల దేవతలయందును- నాకు బ్రియుండ
వగుచు- ప్రతిసంవత్సరంబును- చైత్రశుద్ధ చతుర్దశినాడిందులకేతెంచి-
పౌర్ణమినాడు- రాత్రింబగళ్ళు - నన్నుం బూజింపుచుండుము. నీచే ని
ర్మితంబయిన ఈకాంచీపురంబు- సకలలోకప్రసిద్ధంబయి-మదీయప్రియజ
నకంబై- యెంతకాలంబును నశింపకుండు - నీవెల్లప్పుడు నీపుణ్యకోటి వి
మానంబున నుండు ననుం దలంపుచుండుము - కృతయుగంబు గడచి- త్రే
తాయుగంబు వచ్చుచున్నదిఇక నీలోకంబునకుం బొమ్ము - నాభక్తుండగు

ధర్మార్థాత్మా మద్భక్తోభువివర్తతే । తస్మైదత్తంమయాపూర్వం త్రేతా
యాంమమపూజనం ॥౩౮॥ త్రేతాయుగేవ్యతీతేతు ద్వాపరేధసమాగతే।
అర్చయిష్యతిమామత్ర బృహస్పతిరుపాగతః ॥౩౯॥ తతఃకలియుగేప్రా
ప్తే శేషఃఫణభృతాంవరః । అర్చయిష్యతిమామత్ర యావదాభూతసం
ప్లవం ॥ ౪౦ ॥ గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ భుంజన్ మామేవానుస్మరన్నిహ । ప
రమంసర్వమంత్రాణాం మంత్రమేనంజపస్వమే ॥ ౪౧ ॥ ఓంకారమగ్ర
తఃకృత్వా ద్వ్యక్షరంనమఇత్యథ । ప్రణతార్తిహరాయేతి పదమేనంస
ముచ్చరన్ ॥ ౪౨ ॥ కీర్తయేద్యన్త్విమంమంత్రం మామేవానుస్మరన్స
దా । మామేవేష్యతిదేహాంతే సముక్తస్సర్వకిల్బిషైః ॥ ౪౩ ॥ తత్సమీపం
నగచ్ఛంతి పిశాచగ్రహరాక్షసాః । చోరవ్యాఘ్రాదయస్తద్వ త్తథా
వ్యాధిభయాదయః ॥ ౪౪ ॥ విమానమేతత్పశ్యంతియత్రస్థిత్వానరామమ।
నతత్రభూతరక్షాంసి వర్తంతేమమశాసనాత్ ॥౪౫॥ అవయోఃపరమం

---

గజేంద్రుం డొకండుగలండాతనికి త్రేతాయుగ పూజనంబు పూర్వంబె
నిచ్చితి- యింక నాతండు నాకుంబూజచేయుగలవాడు- త్రేతాయుగం
బుగడచిన- ద్వాపరంబు వచ్చెనేని దేవగురుండైన బృహస్పతి యిచ్చటి
కివచ్చి- ద్వాపరాంతంబువరకు నన్నుంబూజించు - పిమ్మట కలియుగంబు
వచ్చిన- సహస్రఫణా శోభితుండగు శేషుండు నన్నుంబూజించు- నీవు న
డుచునప్పుడు నిద్రబోవునప్పుడు- భుజించునప్పుడు- నన్నుస్మరింపుచుండు
ము- సకల మంత్రోత్తమంబై ఓంకారపూర్వంబై- యార్తినివారకంబ
యిన- నామంత్రంబు నెల్లప్పుడు స్మరింపుచుండుము. యేనరుండైన నా
మంత్రంబు- జపించుచుండు - నాతండు దేహాంతంబున- సకలపాపంబు
లంబాసి- నాతని సమీపంబున- పిశాచగ్రహ భయంబులు- రాక్షసచో
ర వ్యాఘ్రాదిబాధలు- జేరవెరచు. యీపుణ్యకోటి విమానదర్శనంబు-
జేసిన వారలకు- భూతరక్షః పిశాచాదిభయంబులులేవు. ఈరహస్యంబ
యిన మనల సంవాదంబు బఠించువాడును- వినువాడును-నాభక్తులగుదు

గుహ్యం సంవాదంపుణ్యమద్భుతం । కీర్తయేచ్ఛృణుయాద్వాపి మద్భ
క్తస్సభవిష్యతి ॥ ౪౬ ॥ ఇత్యుక్తస్తుతదాబ్రంహా విష్ణునాప్రభవిష్ణునా । గ
గమనాయమతించక్రే తదాజ్ఞాంపరిపాలయన్ ॥ ౪౭ ॥ ప్రదక్షిణంపరిక్ర
మ్య ప్రణిపత్యపునఃపునః । ప్రేక్షమాణోముఖంవిష్ణో ర్నిజగామశనైశ్శ
నైః॥ ౪౮॥ యావత్సత్యవ్రతక్షేత్రేన్యవసత్కమలాసనః । తావత్కాం
చీముపాగమ్య పురీంపరమభాస్వరాం ॥ ౪౯ ॥ న్యవసత్ప్రాణినస్సర్వేబ్ర
హ్మలోకనివాసినః । సమర్చయంతో దేవేశంవరదంభక్తవత్సలం ॥౫౦॥
తైస్సర్వైస్సహితోబ్రంహాకృతకృత్యస్తదామునే। ప్రణమ్యశిరసాదేవంప్ర
యయౌస్వాలయంప్రతి ॥ ౫౧ ॥

అథసురమునిసిద్ధైస్సేవ్యమానఃకృతాత్మా విగళితభయశోకక్రోధమో
హాభిలాషః నవమృదుగళకంఠైఃకిన్నరైర్గీయమాన స్సరసిజవనసూతి
ర్ధామభూయఃప్రపేదే ॥

ఇతి బ్రాహ్మ్యపురాణే భృగునారదసంవాదే శ్రీహస్తిగిరి
మాహాత్మ్యే - హిరణ్యగర్భప్రయాణంనామ
దశమోధ్యాయః.

---

రు. అనిఇవ్విధంబున వరదుండు పలికినవిని పద్మసంభవుం డాదేవదేవున
కనేక- ప్రదక్షిణ నమస్కారంబులుచేసి-యాతని ముఖంబు జూచుచు-నతి
ప్రయాసంబున వెడలి- సకలముని సమేతుండై- కిన్నరీగానంబు లువినుచు
తనలోకంబునకుంబోయె.పూర్వంబున సత్యలోకవాసులెల్ల- పితామహు
తోగూడివచ్చి యాతండుండుపర్యంతంబు- కాంచీపురంబున- వరదుంపూ
జించుచునుండి యానలువంగూడి- వారెల్ల మరల బ్రంహలోకంబుజేరిరి.

ఇది బ్రాహ్మ్యపురాణంబునందు - భృగునారదసంవాదంబున-
హస్తిగిరి మాహాత్మ్యంబునందు - బ్రహ్మ తనలో
కంబునకుం - బోవు కథగల
దశమంబైనయధ్యాయము.

భృగుః ॥ తస్మిన్ కృతయుగేతీతే గతేసరసిజాసనే । త్రేతాయాంతుగ
జేంద్రేణకథంతత్రార్చితోహరిః ॥ ౧ ॥ నారదః ॥ గతేతస్మిన్ సురజ్యేష్ఠే
క్షేత్రేసత్యవ్రతేహరిః । అతిష్ఠద్వరదోనిత్యైర్దివ్యైఃపరిజనైర్వృతః॥ ౨॥
గరుడఃపక్షిరాట్చైషోవిష్వక్సేనాదయస్తదా । సుదర్శనశ్శుభగవాన్ చ
క్రరూపోమహాద్యుతిః ॥ ౩ ॥ పాంచజన్యోజలాధీశశ్శంఖరూపోమహాధ్వ
నిః । కౌమోదకీచతచ్ఛక్తిస్సర్వదుష్టభయంకరీ॥ ౪ ॥ పద్మాఖ్యోవసుధా
ధీశోమహానంబుజరూపధృక్ । శార్ఙ్గాఖ్యోగగనాధీశోధనుర్వేదధరోమ
హాన్ ॥ ౫ ॥ కౌస్తుభోధివసాధీశోమణిరూపధరశ్శివః ॥ సర్వేషామీశ్వరీ
లక్ష్మీఃపద్మహస్తాయశస్వినీ ॥ ౬ ॥ వసుంధరాచచార్వంగీనీలోత్పలద
ళేక్షణా । విష్వక్సేనోమహాతేజాగణానామీశ్వరోవ్యయః ॥ ౭ ॥ తదధీ
నాస్తథైవాన్యేపరిపారాస్సహస్రశః । స్వాధికారేషునిరతాదేవరాజం
నిషేవిరే ॥ ౮ ॥ మహద్వనమభూద్దుర్గంతదాకాంచీమహాపురీ । సింహ
వ్యాఘ్రమృగాకీర్ణఘోరవింధ్యాటవీయథా ॥ ౯ ॥ మహాగహ్వరదుర్గ

---

భృగువు నారదుం గాంచి వో మునీంద్రా - కృతయుగంబు గడచిన-
త్రేతాయుగంబందు - గజేంద్రుం డెవ్విధంబున - వరదుం బూజించె-దా
ని నెరుంగింపుమనిన నారదుండిట్లనియె. వో మహాత్మా- వినుమట్లునలువ
తనలోకంబునకేగిన త్రేతాయుగాదియందు వరదుండు - పక్షిరాజగు గ
రుడుండును - మహాకాంతియుతంబైన సుదర్శనచక్రంబును - జలాధీ
శంబై మహాధ్వనిసనాథంబై వెలయు పాంచజన్యంబును - సకల దుష్టభ
యంకరంబైన కౌమోదకియును - సకల రాక్షసవినాశకారియగు నంద
కంబును- ధనుర్వేదధారియగు శార్ఙ్గంబును - విష్వక్సేనాది పరిజనులును
సర్వైశ్వర్య దాయినియగు లక్ష్మీదేవియు నీలోత్పలాభయగు వసుంధర
యు - మొదలగువారెల్ల సేవింపనతివైభవంబుననుండె - నంతబహు
కాలంబు గడచిన- నాకాంచీపురంబెల్ల వింధ్యారణ్యంబురీతియతిభయంక
రారణ్యంబయ్యె- చందనాగరుపున్నాగ చంపకాది బహువృక్షసమేతం

షే సర్వర్తుకుసుమోచితే । కోకిలాలాపలలితేమత్తషట్పదనాదితే ॥ ౧౦ ॥ మత్తమాతంగసంఘుష్టపద్మకాననశోభితే । హంససారసనన్నాదేకిన్నరీగణనాదితే ॥ ౧౧ ॥ సిద్ధచారణగంధర్వయక్షవిద్యాధరాన్వితే । చందనాగరుపున్నాగచూతచంపకసంవృతే ॥ ౧౨ ॥ స్నిగ్ధగంభీరమధురమయూరస్వననాదితే । విశుద్ధసలిలోపేతదీర్ఘికాశతశోభితే ॥ ౧౩ ॥ నదీపులినవిశ్రాంతరాజహంసోపశోభితే । తరుణార్కద్యుతిస్మేరపంకజామోదసంవృతే ॥ ౧౪ ॥ స్ఫురత్పాటలకల్హారకైరవోత్పలకాననే । స్మేరకేసరసౌగంధికజితామరనందనే ॥ ౧౫ ॥ వికసత్కేతకీసంగమందమారుతసౌరభే । కదాచిల్లీలయాసార్ధంలక్ష్మ్యాలక్ష్మీపతిర్మునే ॥ ౧౬ ॥ సంచచారవనేతస్మిన్ సర్వర్తుకుసుమోచితే । క్రీడన్నైవసనదీతీరేపుణ్యావృక్షసమాశ్రితే ॥ ౧౭ ॥ ప్రవివేశవనంఘోరంలక్ష్మ్యాసహజనార్దనః । ఘర్మాభితప్తాంవసుధామసించజ్జలదాస్తదా । తత్రైవకర్దమక్లిన్నానభవేత్సావనస్థలీ ॥ ౧౮ ॥ యత్రయత్రచరేత్తస్మిన్ వనేలక్ష్మీసహాయవాన్ । తత్రతత్రచచారోచ్చైఃపక్షౌవిస్తార్యపక్షిరాట్ ॥ ౧౯ ॥ చరత్యఖిలలోకేశలీలయైవతదావనే । చరితార్థాభవన్ సర్వేతంద్రష్ట్వావనచారిణః ॥

---

బై సర్వర్తుధర్మంబులుగల్గి కోకిలారావ సుందరంబయి మత్తషట్పఝుంకారంబులుగల్గి మత్తమాతంగ భయంకరంబయి - సిద్ధచారణగంధర్వసేవితంబై - నిర్మలజలసంయుత దీర్ఘికాశతసమేతంబై - నదీపుళినదేశంబుల విహరించు రాజహంసలుగల్గి - అరుణకిరణస్ఫురత్కమలామోదంబులుగల్గి సుగంధనిర్జితామర నందనంబై - కేతకీగంధసుగంధమారుతసేవితంబయి - మనోహరంబగు నావనంబున నొకనాడు వరదుండు లక్ష్మీదేవింగూడి వినోదంబుగా వేగవతీ తీరంబున విహరింపుచుండ - ఘర్మతప్తంబయిన భూమియందెల్ల వలాహకంబులు వర్షించెనా విష్ణుదేవుండు సంచరించు చోటెల్ల - గరుడుండు తన రెక్కలంగప్పుచుండె నంత వనచారులెల్ల - నా మహామహుంగాంచి కృతార్థుల

౨౦ ॥ విచిత్రకుసుమాకీర్ణాం ప్రసన్నసలిలాశయాం । స్ఫురత్కమలకల్హా
రచరన్మీనకులాకులాం ॥ ౨౧ ॥ ఘనశైవలసంఛన్నాం మహాహ్రదసమా
కులాం । నదీం వేగవతీం దృష్ట్వా ప్రహర్షమతులం యయౌ ॥ ౨౨ ॥ చర
త్యఖిలలోకేశే శేషీతుమాణే వనస్థలీం । ససృజుః పుష్పవర్షాణి స్థలే వన్యస్థలీ
రుహాః ॥ ౨౩ ॥ రరాజ తరుభిర్ముక్తైః పుష్పైశ్చ సుమనోహరైః । సత్యవ్రత
మహీ సర్వా నభస్తారాంకితం యథా ॥ ౨౪ ॥ సహకల్హారసంభేదసం
వృతామోదశీతళః । పవనః పూగకాంతారసంగమందగతిర్వవౌ ॥ ౨౫ ॥
న తతాప తిఘర్మాంశురంశుమానపి తద్వనే । పూర్ణబింబశ్చకాశేందుర్వ
నే చరతి మాధవే ॥ ౨౬ ॥ వాసంతికాని శరది వసంతే శారదాని చ । స
మృద్ధాన్యభవంస్తత్ర సన్నృతుశ్చ ముదాన్వితాః ॥ ౨౭ ॥ లక్ష్మీం లక్ష్మీపతిం దృ
ష్ట్వా మేఘం సౌదామనీం యథా ॥ ౨౮ ॥ యే తు తస్మిన్ వనే పూర్వం నిర్మి
తా విశ్వకర్మణా । తాస్సర్వాః కుముదాంభోజైర్విచేరుర్గృహదీర్ఘి
కాః ॥ ౨౯ ॥ మత్తద్విపగణాస్తస్మిన్ విచేరుశ్చ మహావనే । విచేరుర్మృగ
యూథాని నవశాద్వలభూమిషు ॥ ౩౦ ॥ మాధవీమల్లికానాగాః కేతకీకర
వీరకాః । మందారాశ్చ మధూకాశ్చ నీపాః కురవకాస్తథా ॥ ౩౧ ॥ వంజు

---

లైరి - వృక్షంబులెల్ల పుష్పంబులు వర్షించె - నాభూమియెల్ల తారా
గణయుతంబయిన నభంబురీతిం బ్రకాశింపుచుండె - కమలకల్హారామో
దశీతలుండయి పవనుండు వీచె. సూర్యుండు తపింపకుండె - పూర్ణచంద్రుం
డు ప్రకాశించె - వసంతంబున శరత్కాలధర్మంబులును - శరత్కా
లంబున వసంతకాలధర్మంబులుం గల్గియుండె - మేఘవిద్యుల్లతలభం
గిం బ్రకాశించు నాలక్ష్మీనారాయణులం జూచి యెల్లవారు సంతసంబునం
దేలిరి - యావనంబున పూర్వంబు విశ్వకర్మనిర్మితంబులైన దీర్ఘికా
లెల్ల కుముదాంభోజలలితంబులై ప్రకాశించె - చిత్రవిచిత్రంబులైన మృ
గసమూహంబులు నవశాద్వలభూముల సంచరించె నిట్లు సర్వలోకనా
యకుండయిన దేవదేవుండు యావనంబునంగల విచిత్రంబులెల్ల లక్ష్మీదే

లాశ్చతపత్రాక్ష్యఖభూవుఃపుష్పశాలినః । తత్సర్వందర్శయత్ దేవై్యచచా రవరదోవనే॥ ౩౨॥ సర్వలోకేశ్వరస్సాక్షా దక్షయోవిశ్వకృద్విభుః । విని వృత్యతథాతస్మాత్ తయాసహమనోహరాత్ ॥ ౩౩ ॥ అనంతసరస స్తీరం సకదాచిత్సమభ్యధాత్ । తస్యపశ్చిమతీరేతు తపస్యంతంతపోధనం॥ ౩౪॥ దదర్శసుమహాభాగం దివ్యందేవపురోహితం । తిష్ఠంతమేకపాదేన బాహూవిక్షిప్యచోర్ధ్వగౌ ॥ ౩౫ ॥ ఉత్పింజరజటాహారం త్వగస్థిస్నాయు బంధనం । ఉదీక్షమాణమనిశం విమానంపుణ్యవర్ధనం ॥ ౩౬ ॥ జపం తంసతతంవాచా గాయత్రీంవేదమాతరం । నివాతదీపనిష్కంపం ని ర్ద్వంద్వంనిష్పరిగ్రహం ॥ ౩౭ ॥ నిర్మలంనిరహంకారంక్రోధలోభవి వర్జితం । క్షుత్పిపాసాదిభిర్దుఃఖైః పీడితంచాప్యచంచలం॥ ౩౮ ॥ సత తందంశమశకైఃపీడ్యమానమనాకులం । ఆత్మవత్సర్వభూతాని పశ్యం తంమునిపుంగవం ॥ ౩౯ ॥ తందృష్ట్వాసహసాతస్య సమీపంససమభ్య గాత్ । శ్రియాచసహతన్వంగ్యా భూత్వాషోడశవార్షికః ॥ ౪౦ ॥ రాజలక్షణసంపన్న స్సర్వాభరణభూషితః । పద్మపత్రవిశాలాక్షః చం

---

వికింజూవుచు కొంతప్రొద్దువిహరించి యనంతసరోవర తీరంబుజేరి - యందు యేకపాదంబుననిలిచి యూర్ధ్వబాహుండయి పుణ్యకోటివిమా నంబుదలంచుచు వేదమాతయగు గాయత్రింజపించుచు నివాతదీపంబు భంగినొప్పుచు నిర్ద్వండునునిరహంకారుండును క్రోధలోభవర్జితుం డును అచంచలుండునునై నిరంతరంబు మశకాదులపీడింపంబడియు - ఆనాకులుడయి సమస్తభూతంబుల నాత్మసమానంబులుగా నెంచుచు నతి ఘోరతపంబు చేయుచును నిరూపుండైయున్న దేవగురుం గాంచి లక్ష్మీదేవియుం దానును పదియారువత్సరంబులుగల మనుష్యరూపంబుల దాల్చి సర్వరాజలక్షణసమేతుండై సర్వాభరణభూషితుండై పద్మపత్ర విశాలనయనంబులుగల్గి చంద్రబింబ సమానముఖంబువెలుంగ - హంసవి ధంబుననడుచుచు సర్వాభరణభూషితయైవెలుంగు లక్ష్మీదేవి సేవింప

